THE ANDHRA PATRIKA - MADRAS.

6 పేజీలు వెల 1 అణా. హాలీ 0-1-2.

# ఆంధ్రపత్రిక

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 335 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. మంగళవారము 10-3-1953

ఆంధ్రవిశ్వకళా పరిషత్తు ఆర్థికస్థితి అత్యంత ఆందోళనకరంగా వుంది

—2 వ పేజీ

నియోజకవర్గాలు: రాజ్యాంగ సవరణ ప్రతిపాదనకు అసెంబ్లీ ఆమోదం

—3 వ పేజీ

# భూమిసమస్య శీఘ్రపరిష్కారానికి హైద్రాబాద్ ప్రభుత్వ కృషి

## కాంగ్రెస్-ప్రజా సోషలిస్టు పక్షాల సహకారం

### ఇంతవరకూ జరిగిన సంప్రతింపులపై అధిష్ఠానవర్గ పరిశీలన

న్యూఢిల్లీ, మార్చి 8: కాంగ్రెసు అధ్యక్షుడు పండిట్ నెహ్రూ, ప్రజాసోషలిస్టు పార్టీ నాయకులు జయప్రకాశ్ నారాయణ్, ఆచార్య కృపలానీ, నరేంద్రదేవ్ గారలమధ్య ఇటీవల జరిగిన సంప్రతింపులలో, కాంగ్రెసు ప్రజాసోషలిస్టు పార్టీల దృక్పథాలమధ్య ఎంతో సారూప్యం వ్యక్తమైనట్లు తెలుస్తున్నది.

పండిట్ నెహ్రూ తనతో వారికీ మధ్యజరిగిన ఈ సంప్రతింపుల వైఖరిని కార్యవర్గసభ్యులకు వివరిస్తూ, కొన్ని కొన్ని విషయాలను గూర్చి తమ అభిప్రాయాలు కొంత భేదించినా, బహువిషయాలలో తమ దృక్పథాలు కలుస్తాయని ఇరువాగులవారు ఆ చర్చల...

జిల్లా కాంగ్రెసు కమిటీలనుంచి వచ్చే అప్పీళ్లను పరిశీలించి అధ్యక్షునికి సలహాలు యిచ్చే నిమిత్తం కార్యవర్గం డిసిప్లినరీ సబ్ కమిటీ అంటూ ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఆ సంఘంలో సభ్యులు వీరు:- మౌలానా ఆజాద్, లాల్ బహదూర్ శాస్త్రి, ఎస్. ఎన్. అగర్వాల్.

కార్యవర్గం కేంద్ర పార్లమెంటరీ బోర్డుకు ఈ క్రిందివారిని సభ్యులుగా నియమించింది:- కాంగ్రెసు అధ్యక్షుడు (ఎక్స్ అఫీషియో), మౌలానా ఆజాద్, మొరార్జీ దేశాయి, పండిట్ పంత్, జగ్జీవన్‌రామ్, బలవంతరాయ్ మెహతా.

ఈ కమిటీ తయారుచేసే సవరణలు వచ్చే ఏ. ఐ. సి. సి. సమావేశంలో సభ్యుల ఆమోదార్థం నివేదించబడతాయి.

### అఖిల భారత కాంగ్రెస్ కమిటీ

### మే 16 న ఆగ్రాలో సమావేశం

## సంస్కరణాల స్వరూప స్వభావాలపై ముఖ్యమంత్రి వివరణ

### భూమి లేనివారికి పంపిణీకి పది లక్షల ఎకరాలు లభించే అవకాశం

(స్వ కీయ వి లే ఖ రి)

హైదరాబాదు, మార్చి 8: ప్రస్తుతం శాసనసభ ముందువున్న కౌలుదారీ, వ్యవసాయ భూమి బిల్లు చట్టమైతే భూమి లేనివారికి పంచిపెట్టేందుకు 8 లేక 10 లక్షల ఎకరాలభూమి ప్రభుత్వవశమవుతుందని ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు నేడు పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ వివరించారు.

ఈ బిల్లు ఈ సమావేశంలో నే పాస్ కావాలని తమ అభిమతమనీ, సెలెక్టు కమిటీ పరిశీలనకు పంపడం తమ మటుకు తమకు ఇష్టంలేదనీ...

#### భూమివిచారణ సంఘం

#### ఈనాముల రద్దు

జాగీర్దారీ, దుమాల రద్దు పూర్తి అయింది. శాసనసభ ప్రస్తుత సమావేశంలో ఈనాము భూములకు సంబంధించిన మరోబిల్లు ప్రవేశపెట్టాము...

#### బిల్లు స్వరూప స్వభావాలు

### రాష్ట్ర సమస్యపై అధిష్ఠానవర్గ చర్చ

### కాంగ్రెస్ కార్యదర్శి బల్వంతరాయ్ మెహతా వివరణ

న్యూఢిల్లీ, మార్చి 8: ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధానిని మద్రాసులోనే వుంచడానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించేటట్లయితే, తాను మద్రాసు ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇవ్వటం అనివార్యం అవుతుందనీ...

### సుడాన్ ఎన్నికల కమీషన్

#### ఖార్టూమ్‌కు సుకుమార్ సేన్ రాక

ఖార్టూమ్, మార్చి 8: ఆంగ్లో-ఈజిప్షియన్ ఒప్పందాన్ని అనుసరించి, సూడాన్ ఎన్నికలకమీషన్‌కు అధ్యక్షత వహించడానికి ఇండియాతరఫున నియమితులైన శ్రీ సుకుమార సేన్ నేడు ఇచ్చటికివచ్చారు.

### హైద్రాబాద్ ప్రభుత్వోద్యోగుల జీతాలు

హైదరాబాద్ మార్చి 9: హైదరాబాద్ ప్రభుత్వోద్యోగులందరూ, ప్రస్తుతం ఉస్మానియా కరెన్సీలో తీసుకుంటున్న జీతాలను ఇండియా కరెన్సీలో సమానమయిన విలువగల మొత్తాలనే ఇవ్వటం జరుగుతుందని ఆర్థిక మంత్రి డా॥ జి. ఎస్. మేల్కోటె నేడు రాష్ట్రశాసనసభలో ప్రశ్నల జవాబిస్తూ ప్రకటించారు.

తమకు ఉస్మానియాలో ఇస్తున్న జీతాలకు సమానమయిన ఇండియా ద్రవ్యాన్ని ఇవ్వకపోతే సమ్మెజరిగే అవకాశం ఉందని మజ్లూర్ సంఘం ఎన్. జి. ఓ. సంఘాల అధ్యక్షుడు సూచించి ఉన్నాడు. అంటే ఉస్మానియా రూపాయి ఇండియా రూపాయికన్నా తక్కువ విలువది అయినప్పటికీ, ఎన్ని ఉస్మానియా రూపాయల జీతం ఉంటే అన్ని ఇండియా రూపాయలు ఇవ్వాలని కోరుతున్నారన్నమాట.

పై మార్పు ఏప్రిల్ 1 నుంచీ అమలులోకి వస్తుందని డా॥ మేల్కోటె తెలియజేశారు.

## రాష్ట్రాల్లో ఎగువ శాసనసభల భవిష్యత్తు

### నిర్ధారణాధికారం అసెంబ్లీలకు వదిలివేస్తూ అధిష్ఠానవర్గ నిర్ణయం

న్యూఢిల్లీ, మార్చి 8: రాష్ట్రాలలో ఎగువ శాసనసభలను రద్దుచేయడం వాంఛనీయమా? కాదా? అనే విషయమై కాంగ్రెసు కార్యవర్గం ఈవేళ చర్చలు జరిపింది.

ఈ విషయమై ఆయా రాష్ట్ర శాసనసభలలోని కాంగ్రెసుపార్టీల అభిప్రాయాలను ఏ. ఐ. సి. సి. యింతకు పూర్వం భోగట్టాచేసి సేకరించివున్న సంగతి పాఠకులు ఎరిగిందే.

ఎగువ శాసనసభలను రద్దుచేయాలా? వద్దా అనే విషయమై కార్యవర్గం కొంతదూరం చర్చ జరిపిందిగాని నిర్ణయం అంటూ తాను ఏదీ చేయలేదు. చివరికి ఇది నిర్ణయించే అధికారం ఆయా రాష్ట్రశాసనసభలకే వదిలివేయటం యుక్తం అని కార్యవర్గం అభిప్రాయపడింది.

ఎన్నికలకు సంబంధించిన అనేక విషయాలు ముఖ్యంగా అభ్యర్థులనియామకం అనేది ఎప్పుడు జరగాలి? ఎన్నికలకు కొద్దిరోజులు ముందుగాచేస్తే సరిపోతుందా లేక చాలాకాలం పూర్వమే చేయాలా? అనే విషయం కూడా చర్చకు వచ్చింది...

ఎన్నికలనిధి ఒకటి ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన కూడా చర్చకు వచ్చింది. కాని నిర్ణయం ఏదీ జరగలేదు.

## పాకిస్తాన్‌లో అహమ్మదీయ ప్రతికూల ఆందోళన ఉధృతం

### రావల్పిండికి విస్తరణ: పోలీసు కాల్పుల్లో ఒకని మరణం. 6 గురికి గాయాలు

అమృతసరము, మార్చి 8: నేడు రావల్‌పిండీలో, పోలీసులు అల్లరి మూకలపై తుపాకులు కాల్చడంవల్ల ఒకడు మరణించాడని, 6 గురు గాయపడ్డారని నేటి రాత్రి పాకిస్తాన్ రేడియో ప్రకటించింది.

రావల్‌పిండీలోని రేడియో పాకిస్తాన్ చెప్పిన మాటలను ఉల్లేఖిస్తూ రేడియో ఈ క్రిందివార్త ప్రసారం చేసింది: "నేడు రావల్ పిండీలో సంపూర్ణమైన హర్తాళ్ జరిగింది. అహమ్మదీయులకు ప్రతికూలంగా ఆందోళన చేస్తున్నవారు అనేక ఊరేగింపులు బయలుదేరదీశారు..."

#### లాహోర్ పరిస్థితి

#### సైనిక పరిపాలకుని హెచ్చరిక

## యునాన్ రాష్ట్రానికి చైనా శతఘ్ని దళాలు

### సరిహద్దు రక్షణకు పెకింగ్ ప్రభుత్వ చర్యలు

రంగూన్, మార్చి 8: చైనా ప్రభుత్వం తన శతఘ్నిబలంలో కొంత భాగాన్ని చైనా బర్మా సరిహద్దు రాష్ట్రం యూనాన్‌కు బట్వాడా చేసినట్లు తెలుస్తున్నది...

## "కొరియా సమస్యా పరిష్కార ప్రయత్నాన్ని విరమించకూడదు"

### భారతదేశానికి ఫ్రెంచి ప్రతినిధి విజ్ఞాపన

ఐక్యరాజ్య సమితి... మార్చి 7 కొరియా సమస్య పరిష్కారం విషయమై ఇంకా తన ప్రయత్నాన్ని...

## ఢిల్లీ జనసమూహంపై లాఠీచార్జీ, బాష్పవాయుప్రయోగం

### జమ్మూ ఆందోళనలో ఇప్పటికి 43 గురి అరెస్టు

న్యూఢిల్లీ, మార్చి 8: ఢిల్లీలో గొప్ప వ్యాపారకేంద్రమైన సాదర్ బజారులో సమావేశమైన రెండువేలమందిపై నేడు ఢిల్లీ పోలీసులు లాఠీఛార్జీ చేశారు; బాష్పవాయువు ప్రయోగించారు.

#### పఠాన్‌కోట్‌లో అరెస్టులు

## ఈజిప్టు మైన్‌స్వీపర్ ప్రమాదం

### 52 మంది దుర్మరణం

అలగ్జాండ్రియా, మార్చి 8. ఈజిప్టు తీరానికి ... మైన్‌స్వీపరునౌక ఇచ్చటకు 16 మైళ్లదూరం సముద్రంలో మునిగిపోయింది...

## పాస్‌పోర్టు విధానం

(2 వ పేజీ చూడుడు)

